రాయలసీమలో పెన్నేటి గట్టున ఉన్న పల్లెల బ్రతుకునీడ ఇందులో కాన వస్తుంది. అక్కడి పలుకుబడులూ ఊరు, పేరులూ ఇందులో కనిపిస్తాయి.

ఇది కావ్యం. చరిత్రగానీ, కథగానీ కాదు. కాబట్టే ఏ ఒక్క పల్లెనో ఏ వ్యక్తి జీవితాన్నో ఉద్దేశించి వ్రాసినది కాదు.

మదరాసు,
విశ్వం

10-4-1956

ప్రశస్తమైన రాయలసీమను బింబించిన 'పెన్నేటి పాట' తెలుగువారందరి హృదయాల మాట.

"పెన్నేటి పాట" ను ప్రచురించే భాగ్యం కలిగినందుకు తెలంగాణా రచయితల సంఘం గర్విస్తున్నది.

మా సంఘానికి ఆప్తులైన విద్వాన్ విశ్వంగారు మాకు ఆప్తతములైన శ్రీ నార్లవారికి ఈ కావ్యాన్ని అంకితం చేయడం మాకు ఎంతో ఆనందాన్ని కలిగించింది.

బహుముఖ ప్రజ్ఞాధురీణులై న శ్రీ విశ్వంగారి ఈకావ్యాన్ని యావదాంధ్ర సాహిత్యలోకం సాదరంగా అమృతోపాయనంగా స్వీకరిస్తుందని తెలంగాణా రచయితల సంఘం ఆశిస్తున్నది.

తెలంగాణా రచయితల సంఘం
ఇట్లు,

3-5-1027 నారాయణగూడ
సి. నారాయణరెడ్డి

హైదరాబాదు.
ప్రధానకార్యదర్శి

# పీఠిక

## శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

రాయలసీమ నేడు అఖండాంధ్ర దేశములోని ఒక విశిష్టఖండముగా ఏర్పడియుండుటకు దాని యిప్పటి దరిద్రావస్థ ముఖ్యకారణము. మైసూరు పర్వతాల అధిత్యకా భాగమై, అడుగడుగునను పెద్ద చిన్న కొండలు అడవులు కలిగి, ఎన్నో చిన్న పెద్ద నదుల వెల్లువలచే చల్లఁదనము కొల్ల పంటలు గలిగి, అపారమైన గోధనమును బోషించుచు సర్వసమృద్ధమై యొకానొకప్పు డుండినది. ఎన్నో చిన్నపెద్ద రాజ్యములకు రాజధానులకు చోటిచ్చిన దీ సీమ. పరిగి, హేమావతి, రాయదుర్గము, గుత్తి, పాగొండ, బళ్ళారి, మడకసిర, మధుగిరి మొదలగునవి అట్లుండగా, విజయనగరపు చక్రవర్తులకు వేసవికాలమందలి చలువరాజధానిగా ఎంతో కాల మాశ్రయ మిచ్చిన పెనుగొండ - ఘనగిరి, ఇందలిది. రామరాజభూషణుని నోరూరించిన 'దాడిమలతా లలితాంగు'లు, ఆకాలపు 'జటిల ద్రాక్షాగుళుచ్ఛంబులు' నేడును అక్కడ పుణ్యవంతులు చవిచూడవచ్చును. షష్టిపూర్తి చేసుకొన్న ఆ సీమవా రందరికి అక్కడి ప్రాచీన సమృద్ధిలో కొంతభాగ మైనను చిన్నతనమున అనుభవమునకు వచ్చియుండును. మఱి వారు దానిని మఱువలేరు.

ఆ వైభవ పరిశేషము క్రమముగా మావంటివారి కన్నుల యెదుటనే అంతర్ధానమైనది. అక్కడి లెక్కలేని చెఱువులలో ఎన్నో తెగిపోయినవి. ఉన్నవి ముప్పాతిక పూడిపోయినవి. మైసూరు రాజ్యమువారు పైనుండి దిగివచ్చు నదులకు వంకలకు చెఱువులు గట్టుకొని ఊట నడ్డగించుటచే నదులకు వాననీరు తప్ప వేఱునీరు లేకపోయినది. 'సరవ' అను పేర అంతర్గామినిగా శాఖోపశాఖలుగా ప్రవహించుచుండిన సరస్వతి వట్టి యిసుకపాతరగా మాఱినది. అందందు సహజముగా ఎగజిమ్ముచుండిన 'తలపరిగలు' - నీటిబుగ్గలు, వట్టివాయి విడుచుకొని క్రమముగ మన్నుమూసి కొన్నవి. అడవులన్నియు వంటచెఱకులై పొగబాఱి పోయినవి. పశుసంపద కటికవారి పాడైపోయినది. ఇక మనుష్యుల మాట చెప్పనేల? ఆంగ్లేయుల దొరతనములో ఈ సీమ యెన్నివిధముల ఎండవచ్చునో అన్నివిధములను ఎండినది; ఎండింపఁబడినది. ప్రజల పరవశత, అధికారుల అలక్ష్యము, ఇరుగు పొరుగులవారి స్వార్థపరత, వీనికి తోడు దైవము దయదప్పుట. ఇన్ని కలిసి నేటి రాయలసీమ రూపుగొన్నది. మఱి తోడి ఆంధ్రులే అధికారము అవకాశము గలిగినప్పుడు గూడ ఈసీమ యోగక్షేమములను గమనింపలేదు. సరిగదా, మీదుమిక్కిలి ఇది రాళ్ళసీమయని, అరణ్యమని, ఇక్కడివారికి చదువుసంతలు లేవని, వారు అనాగరకులని పరిహాసమును ఆక్షేపమును జేసినవారును కొంద రుండిరి. నేడును లేకపోలేదు. ఇది 'క్షతే క్షారమివాసహ్యం' అన్నట్లయినది ఆ సీమవారికి. ఇది ముఖ్యకారణముగా ఈ ఆంధ్రఖండమునకు 'రాయలసీమ' అని విభిన్ననామమును తాము ఇతరాంధ్రులతో చేరియుండ లే మనుభావము ఇందలి ప్రజలకును గలిగి వ్యాపించినది. ఆంధ్రరాష్ట్రి సాధనకు ఇది అడ్డుదగులు నేమోయను తీవ్రభయమును ఉండెడిది. కాని కొందఱు దూరదృష్టిగల మహనీయుల ప్రయత్నముచేత అట్లు జరుగలేదు. మా రాళ్ళపల్లికి సమీపమందలి పేరూరు అను గ్రామమువద్ద మల్పుదిరుగు పెన్నేటినడ్డగించి చెఱువు కట్టవలెనను భావము సర్కారువారికి ఏ మహనీయుడో సుమారు 55 సంవత్సరాలకు

ముందు కలిగింపగా, ఆ పని మొన్న మొన్నటిదాకా రూపెత్తలేదని, నేటికిని పూర్తి కాలేదని తెలిసికొన్నవారికి ఈసీమ దైన్యమును, దీని గమనించిన సహృదయులకుఁ గలుగు నిర్వేదమును కొంత అర్థము కాగలవు.

నామిత్రులు విద్వాన్ శ్రీవిశ్వంగారి అట్టి తీవ్రనిర్వేదమే ఈ పెన్నేటి పాటగా పరిణమించినది. వాల్మీకి తనకు గలిగిన శోకము శ్లోకమయినదని చెప్పుకొన్నాడు. కాని వాల్మీకి మనుష్యత్వపరభాగమైన మహర్షిత్వమును సాధించుకొన్న మహాతపస్వి. కనుక అతని శ్లోకములలో మూలమైన శోకము ఎక్కువగా ప్రతిఫలించలేదు. శాంతి, దాంతి, శౌర్యము, వివేకము, దయ, ధర్మము, వింతలు, వినోదములు, ఇత్యాది భావములే యెక్కువగా నుండి ఆయన రచన ప్రశాంత మధురమైనది. విశ్వంగారిది మానవహృదయము. ఊహకన్న, భావనకన్న అనుభవమే మూలాధారముగా వెడలిన పరవశ రచన వీరి 'పాట.' నిర్వేదము తీవ్రమైనప్పుడు అన్ని నియమాలను చెల్లాచెదరుచేయు వేసటగా పనిచేయును. అది యీ 'పాట'లో కవిగారిని ఎన్నో ఆటలాడించినది.

ఈ దేశమునందలి ప్రాచీనవైభవము అంతయు ఒక దృశ్యముగా కన్నులకు దట్టి ఈ కావ్యతాండవమునకు నాందిగా ఒక సీసము ఒక గీతము మెఱుపు దీగవలె మిఱుమిట్లు గొల్పుచు కవిగారి కలమున మెఱసిపోయినది. ఉత్తరక్షణమందే

"కోటిగొంతుల కిన్నెర మీటికొనుచు
కోటిగుండెల కంజరి కొట్టుకొనుచు"

'నేఁటి రాయలసీమ కన్నీటిపాట' స్వచ్ఛందవృత్తముతో వెలువడినది. అందు ప్రతిఫలించినది 'పీనుగులపెన్న', 'వట్టియెడారి', 'నక్కబావలు', 'నాగుబాములు', 'బొంతగద్దలు', 'రేణగంపలు', 'పల్లేరుగాయలు', 'తుమ్మతోపులు' ఇత్యాది అసంఖ్యాసామగ్రితో విశ్వంగారి కవితా విరూపాక్షుడు తాండవించినాడు; భాష, అర్థము, భావము, ఛందస్సు అన్నియు ఆ తాండవమునకు ప్రక్కవాద్యాలు వాయించినవి. 'పిన్పాట' పాడినవి; ఒక మాటలో, ఒక చేయూపులో, ఒక తలయాడింపులో, ఒక తిరుపులో ఈ నటరాజు రాయలసీమలోని భూతభవజ్జీవితమునందలి చిన్నపెద్ద ఖండికలెన్నో విసరివైచినాడు.

ఈ దృష్టికి - ఈ సృష్టికి కథ యనావశ్యకము. అసాధ్యముగూడ. రంగడు ఒక పెద్ద రైతుకు ఏకపుత్రుడు. ఆ తండ్రి 'పెగ్గిలు' బ్రతుకులో కొడుకుకు మిగిలిన ఆస్తిపాస్తు లన్నియు వాని శరీరమొకటే. వాని చిన్న యిల్లాలు గంగమ్మ. ఆ 'గంతకు తగిన బొంత.' కాని ఆ రెంటిలోను ఎంతో ఒద్దిక, మార్దవము, సామరస్యము గలదు. ఇద్దఱికిని ఆయిద్దఱు తప్ప వెనుక ముందుల వా రెవరును లేరు. గడ్డియో, కట్టెలో దొరికినది అడవినుండి మోపుగట్టుకొనివచ్చి వచ్చినంత కమ్ముకొను కూలిపని రంగనిది. ఇరుగుపొరుగువారింట వడ్లో, అటుకులో దంచి నూకలో తవుడో తెచ్చుకొను నాలిపని గంగమ్మది. ఈ యిద్దరి పరస్పర ప్రేమ, పరోపకార బుద్ధి, కవుడులేని నడత, అంతులేని దారిద్ర్యము, విసుగుకొనుటకును వీలులేని కాయకష్టము. ఇరుగుపొరుగువారి నిస్సహాయత, చేతనైన వారి యుదాసీనత, ఈనడుమ గంగమ్మ గర్భము, దోహదము విశ్రాంతి లేక ఆ పిల్ల పడు కష్టములను చూచి చేయున దేమియులేక రంగడు 'సమాధిగతుండగు యోగిబోలె స్తబ్ధుడై' యుండుట - వారి భవిష్యత్తును గూర్చి పెద్దగా ధ్వనించు ప్రశ్న - ఇదే ఇందలి వస్తువు. కడపట

'హృదయమా! మానవుడు నిన్ బహిష్కరించె!'
'చచ్చె నీ లోకమున మనస్సాక్షి యనుచు
నెత్తి నోరిడి కొట్టుకోనిండు నన్ను!'

అని భరతవాక్యము పాడినారు కవిగారు!

కాని ఇంతనిస్సహాయమైన నిర్వేదమునందును కావ్యపు కమనీయత యెంతో యున్నది. దానికి ఆ పెన్నేటి 'నీటిలో కమ్మదనము లూరు చుండును' అను అంతస్తత్త్వమును కవిగారు మఱవకుండుటయే కారణము.

"గుండె జలదరింపజేయు రండతనము డుల్చివేయు
ఖండితవాదిని జేయును దండితల్లి సు మ్మీ నది!"
"నిండుమనసు నిజాయతీ - దండిచేయి ధర్మదీక్ష
పండువయసు పట్టుదలా - పండించును గుండెలలో."

అను నమ్మకము వీరి కావ్య కామనీయకబలమునకు చేయూత. ఇతర సీమలవారికీ గుణములు ఎంతవఱకు ఉన్నవి. ఆదేశాలలో దరిద్రదేవత ఏరీతులలో తాండవించుచున్నది, అను చింత, చర్చ, ప్రకృతవిషయము కాదు. పై గుణములు రాయలసీమవారి కేమాత్రముండినను వారు మరల చేతరించుకోగలరు. 'సమానానా ముత్తమశ్లోకో అస్తు' అను వైదిక మంగళాశంస యెట్లున్నను 'సమానానాం సమాన శ్లోకో అస్తు' అనుకో గలిగిరేని రాయలసీమవాసులు ఎవరికిని తలవంచ బనిలేదు. ఆ నారు పైరగు కాలము వచ్చినది. పంటగూడ ఎంతో దూరమున లేదు.

శ్రీ విశ్వంగారి వివిధ విస్తృత వాఙ్మయసేవను చవిచూచుచున్న తెలుగువారు ఈ చిన్నికావ్యమునందలి పెద్ద హృదయమునకు తప్పక స్వాగతమిత్తురు.

# మొదటి సర్గ

కలమ పాలికల యాలల మేలి పాటల
జుమ్మని మ్రోయు మించుల సితారు;
తెనుగు పెద్దన్నల గొనబు పల్కుల, గుబా
ళించిన జాజి మల్లెల గుడారు;
జిలుగు జరీబుటా వలువ సింగారింపు
మెలకువ లూర్చు నిగ్గుల కొతారు;
తలకు మించిన సత్యముల లోతులను జీల్చు
చును వోవు తెల్వి యంచుల కతారు;

కడిది మొనగాని
ఎడద చిక్కనకు పేరు;
కటిక ఊలను కవ్వించి
గజ్జకట్టి
చిందు ద్రొక్కించు
మాయల జిలుగు తేరు
కలదు
రాయలసీమ పచ్చల బజారు.

అచట నొకనాడు పండె
ముత్యాల చాలు;
అట నొకప్పుడు నిండె
కావ్యాల జాలు;
అచ్చట నొకప్డు కురిసె
భాష్యాల జల్లు;
విరిసె నట నాడు
వేయంచు విచ్చుకత్తి.

ఇది గతించిన కథ;
వినిపింతు నింక
నేటి రాయలసీమ
కన్నీటి పాట
కోటి గొంతుల
కిన్నెర మీటుకొనుచు
కోటి గుండెల
కంజరి కొట్టుకొనుచు.

అదే పెన్న! అదే పెన్న!
నిదానించి నడు!
విదారించు నెదన్, వట్టి
ఎడారి తమ్ముడు!

ఎదీ పెన్న? ఎదీ పెన్న?

ఎదీ పినాకినీ?
ఇదే పెన్న! ఇదే పెన్న!
ఇదే పినాకినీ!

ఎదీ నీరు? ఎదీ హోరు?
ఎదీ నీటి జాలు?
ఇదే నీరు! ఇదే హోరు!
ఇదే ఇసుక వాలు!

అదే పెన్న! అదే పెన్న!
నిదానించి నడు!
విదారించు నెదన్, వట్టి
ఎడారి తమ్ముడు!

పార చేబట్టుకొని
వంగి చీరు దనుక,
ఇట్టె చెమ్మట
కాలువ గట్టు దనుక,
ఇసుక పాతర లోతుల
కేగు దనుక,
నీకు కన్పించ దీయేటి
నీటిచుక్క!

కుండపోతల వానలు
గుఱియ నేమి?
పట్టుమని పదినాళ్ళలో
పారబోసి,
ఇసుక బొక్కసమున
మిగులెల్ల దాచి,
పెన్న పడుకొను
నీ నేల దిన్నెమీద!

చిటపట వానలకే, ఒ
క్కట నోరుం దెఱచి, నురుగు గ్రక్కుకొనుచు,
త్కటమై, దరు లొఱసి, రటత్
కటు ప్రవాహముల నింగికై పరువెత్తున్.

జఠర లుఠ ర్ఘుషమై, క
ర్మఠులై దరిజేరు జీవరాశుల మ్రింగున్;
హఠ మెంతని! ఇది చేయని
హఠాత్ కఠోర క్రియా విహారము కలదా!

కాని, ఈ ఏటి నీటిలో
క్రమ్మదనము లూరుచుండును;
దోసిట నొక్కమారు

పుక్కిలించిన జాలు
నీ పుట్టువునకు,
సార్థకత్వమ్ము
నిష్కల్మషత్వ మబ్బు!

గుండె జలదరింపజేయు;
రండతనము డుల్చివేయు
ఖండిత వాదిని జేయును
దండి తల్లి సు మ్మీ నది!

కండలేక ఎండిపోయి
బెండు వారినా సరే!
తిండిలేక, తుండులేక,
పండవారినా సరే!
నిండు మనసు, నిజాయితీ,
పండు వయసు, పట్టుదలా,
దండిచేయి, ధర్మదీక్ష
పండించును గుండెలలో.

రండు రండు! చేతు లెత్తి
దండము తల్లీ యని, కై
దండల దండలతో, నీ
రెండ నిలిచి కొలుచి పొండు!

ఇంత మంచి పెన్నతల్లి
ఎందు కెండి పోయెనో?
ఇంతమంది కన్న తల్లి
ఎందు కిట్లు మారెనో?

వంతలతో, చింతలతో
కంతలువడి పోయెనో!
సంతుకోస మేడ్చి ఏడ్చి,
గొంతు కారిపోయెనో!
ఇంతమంది కన్న తల్లి
ఎందు కిట్లు మారెనో?
ఇంత మంచి పెన్నతల్లి
ఎందు కెండి పోయెనో?

ఈ యేటి కాల్వ లోతుల
పాయలుగా పారు, నీటి ప్రతి బొట్టున, నీ
చాయల రైతుల నెత్తుటి
చాయలు సమ్మిళితమై విచారము గొల్పున్.

ఈ యేటి దరుల దిన్నెల
పాయక దిరుగాడు నక్కబావలె యెపుడున్;

వేయారు పీన్గు లిచ్చట
నే యంత్యక్రియల బొందు నెప్పటి కపుడే.

సుర గరుడోరగ విద్యా
ధర కిన్నర సిద్ధ సాధ్య దైవత తరుణీ
చరణారుణ పంకేరుహ
వర రేఖలు లేవు; వట్టి వఱడులె తిరుగున్.

నాగ కన్యక లిచట
కన్పడరు గాని,
నాగుబాములు చక చక
సాగు నిచట;
గరుడ గంధర్వ కామినుల్
కానబడరు గాని,
బొంత గద్దలు
గుంపుగట్టు, నిచట!

ఏలా లతాజాల డోలిక లిట లేవు
తిప్పతీగెల తలతిక్కెగాని,
తరుణ ప్రవాళ లతా కుంజములు లేవు,
రేణగంపల పొదరిండ్లెగాని;
లలి లవంగ కుడుంగ లాలిత్యములు లేవు,
తుమ్మతోపుల ముండ్లదొరులె గాని;
నారికేళాది వనాంతరస్థలి లేదు,
చిట్టీత డొంకల చేటెగాని --

ఇట గులాబీలు
తలసూప వెపుడు; వట్టి
తంగెడుల్ బోదగడ్డి గాదములె
పెరుగు!
సరస సుకుమార తృణ
సమాచ్ఛదము లేదు,
పాడు పల్లెరుగాయల
బీడెగాని!

శుక పిక శారికా రవ
రుచుల్ వినిపింపవు; గూబమూల్గు, లొ
క్కొ కతటి గుండె పీల్చును;
దిగుల్ వడ జేయును తీతువుల్; సము
త్సుక వృక జంబుకమ్ములు
మతుల్ సెడ గుయ్యిడు; వల్లకాడు పె
న్నకు నిరుగట్టులందు
పులినస్థలి పుట్టెలు పండు మెండుగన్.

బల్లులు, తొండలు, నెలుకలు,

పిల్లులు, కుక్కలును, చెవుల పిల్లులు కొల్లల్;
కొల్లలు తేళ్ళుం జెఱ్ఱులు -
ఇల్లూ వాకిలి యిదే ఫణీంద్రుల కెల్లన్.

పుట్టలు గుట్టలు గుట్టలు;
పట్టెడు పట్టెడు నిజమ్ము పాపరకాయల్
పుట్టెడు పుట్టెడు జులుకులు -
కట్టా! ఇదియేటి యేటిగట్టు తమ్ముడా!

నిట్రాళ్ళకు చెట్రాళ్ళకు
బేట్రాళ్ళకు కొదువలేదు; బిసబిస నడువన్
కుట్రెళ్ళి వచ్చు, నీ తల
పేట్రేగును సుమ్ము ముందు వెనుకల్ గనుమా!

ఆ చింతచెట్టు కొమ్మే - చిన్నగాని యీ
పిరి దీసివేసిన యురికి బ్రాపు;
ఆ తుమ్మచెట్టు దిమ్మే - సీతిగాని కా
అకు జేర వేసిన జాలుగాయ;
ఆ యీతచెట్టు పట్టే - యెంకి కడియాల
నూడ్చిన తీర్పులో నొక్క సాక్షి;
ఆ బోదపోచ రెమ్మే - బుఱ్ఱ ఎరుకల
సాని చండా లూడ్పుజాలు జాణ

ఆ ఇసుక దిబ్బయే -
చలమన్న బండి బడక
నమ్మించినట్టి మ్రుక్కడి కసాయి -
అక్కటక్కట! ఇక్కడ అడుగు దీసి
అడుగు బెట్టుటకే
గుండె లవిసిపోవు.

విడుగుచుండె తిమిర మదే
తొడుగుచుండె నరుణకాంతి
తడబడ పనిలే దిక అ
క్కడ నేదో కోడికూత!

వడి వడిగా నడు! నడు!! క
న్పడు నేదో పల్లె యొకటి -
విడుగుచుండె తిమిర మదే
తొడుగుచుండె నరుణకాంతి.

అటు నిటు కల్లకంప
తరుణారుణ దీప్తులు దూరనేర విచ్చుట!
నడుమన్ గలట్టిది విశాల మహాధ్వము
మూడు మూళ్ళు;
చిక్కటి యిసుకన్ పదమ్ములు

కకావికలై చను;
నీడ్వలేక ఎంతటి బిగిగిత్తలైన
దగ తల్లడిలున్ - మన మింక లెక్కయా?

ఈడొంక - పెండ్లిండ్ల కేగు వారల
నెన్ని తూరులు దొంగలు దోచుకొనిరొ?
ఈడొంక - నిండు బండ్లెన్ని మారులు
బరువెక్కుట యిరుసు పుటుక్కు మనెనొ?
ఈడొంక - నెన్ని సార్లెందరు మొనగాండ్ల
కాలుసేతుల యెముకలు విఱిగెనొ!
ఈడొంక - మంచినీళ్ళెత్తుకవచ్చు
కొంగ్రొత్త కోడం డ్రెంత కుళ్ళుకొనిరొ!

ఇచట మునిమాపులం దెన్ని యెన్ని
మోజుకతలలో రసపట్టులు కాటువడెనొ!
ఇచట నెండప్రొద్దుల పసు లెన్ని యెన్ని
ఇంత విశ్రాంతికై
తపియించినవియొ!

ఇది విడిది ఆలమందకు,
నిదియే గొఱ్ఱెలకు తావు, నింక మేకలన్
గదుముక వత్తు రిచటికే,
ఇది పులులకు రేవు నీటి యెద్దడి యయినన్.

వంక ఇదియె
కొండ వాగుతో నేర్పడె!
వాన వచ్చినపుడు
వంక పాఱు;
దీని లోన
ప్రక్కగా నున్నదే కాల్వ,
బాట దరిని
మంచినీటి చెలమ!

అదిగో! పారల నెత్తిపట్టుకొని
వేయార్మంది, యీ కాల్వనే
పదిలంబుం బొనరింప వత్తు;
రిది కుప్పల్గొట్టు కాలమ్ముదాక
దినమ్మున్ బ్రతిరైతు సేయవలె;
సర్కా రూరకే పన్ను వేయుదు రంతే -
ఒకనాడు మానిన
పొలా లుత్తుత్తవై పోయెడిన్.

ఆ గుంపులోన వచ్చు
రాగమ్మున యాలపాడు రంగన్న కిదే
యాగము, యోగము, భోగము,

రోగమ్మును గూడ నిదియే
రోజులు గడవన్.

ఇది మొదటి సర్గ

# రెండవ సర్గ

రంగనికి గలట్టి
బ్రదుకుటాదరువు 'యర్రోని చేను' పాలు
రొంపి రొచ్చు;
ఉన్న దొక్క యెకర మూపిరి దీయును,
కాల్వ త్రొవ్వ కమ్మె
కండ లూడ్చు.

ఒకనా డతని నాన్న
ఊరిలో పెద్ద సంసారి;
నాలుగు కాండ్ల సాగుబడిని సేయు
పట్టాదారు;
వేయారు రైతుల కిస్తీల కస్తీల,
కేలు సాపి ఆదుకొనుచు
మంచి యనిపించు కొన్నాడు;
పేదసాదల కింత పెట్టినాడు;
ఊరి దేవళమున
కొకనెల కొకరోజు పూజ కిచ్చు
పెద్ద పుణ్యవంతు డనుచు
తంబళ్ళ సుబ్బమ్మ దినదినమ్ము
నొప్పుకొనుచుండు;
దాసరి ఓబిళేసు -
గరుడ గంబమ్ములో
వెండికాసు వేయు పరమ భాగవతుం డని
పాడు నతని.

గుడిసె ముందట నీడలో గూరుచుండి,
అలతి యీతాకు చాపల నల్లుకొనుచు,
దొంగ సుంకన్న తిరణాల తోదులోన
పాటగట్టె నీయనపయి మేటి యనుచు.

"సై సై నారపరెడ్డి నీ
పేరే బంగరు కడ్డీరా||
పారబోస్తివి దాన్యమంతా
ఊరడిస్తివి పేదవోళ్ళను
కోరమీసం మెలీపెడితే
సీరాముడు నీవే నయ్యా||
అంతపూరం బాటలోనా
చింతలపల్లె చెఱువుమీనా
పంతమేసీ బండిదోల్తే
పటుకలాసనె కలెకటేరూ||
పప్పూరూ అసీవెర్తం
పరషలో కోలన్నగాళ్లు

పాడుతాంటే సంచి రూకలు
పారేస్తివి బట్టమీదా ||సైసై||"

అది పల్లెపాట నె
మ్మదిలోని మాట;
మొద లుండునే కాని
తుదలేని బాట;
పదినోళ్ళలో పడి
పదిరూపు లెత్తి,
కదలి పోయెడు కైత
కమ్మని యూట.

బట్ట లచ్చుమయ్య, బండారు బసవయ్య,
పంచ రత్నములను బట్టిపెట్టి
ఊరి సుంకులమ్మ
తేరునా, డీయన
సన్నిధానమందు చదివినారు.

"శ్రీసుంకులాంబ నీ కే
గాసియు రాకుండ జూచి గ్రమ్మఱ బ్రోచున్
భాసుర కీర్తి పతాకా
ధూసరితాజాండకుండ దోర్బలశుండా!

పాకారి ప్రభృతులలో
శోకారి యటంచు పేరు సొగసుగ గను, నా
కాకాసుర సంహారి, ని
రాకృత దుష్టారి బ్రోచురా నారప్పన్.

ఇంద్రుడ వీవె చంద్రుడవు
నీవె యటం చని మాదు డెందముల్
సందడి సేయుచుండె నర
సన్న కుమారుడ, నారపాఖ్య! నిం
బొందిన మా పురీ విభవ
పూర్ణత నెంచగ నాదిశేషుడున్
తొందరవోవు! పత్తికుల
దుగ్ధ పయోధి సుధాకరా! వరా!

ఇల్లాలు నీకు రామమ -
చెల్లెలు నాగన్నరెడ్డి సింహునకున్; నీ
వల్లుడవు దుబ్బిరెడ్డికి
ఫుల్లాంభోజాత నేత్ర! పూతచరిత్రా!

ఎద్దులబండి నెక్కి, పయ
నించుచు నుండగ ధూళి రేగి, ఆ
ప్రొద్దున మూసివేయగనె

పో సురవైరులు లేచి వచ్చి, రా
యెద్దుల తోకలం గలుగు
నింతటి మారుతమంత వీచినన్
దద్దయు ప్రొద్దుదోచె - పిశి
తాశను లంతట పారిపోవరే!"

ఈ పంచరత్నముల విని,
కోపమ్మున మొగము ద్రిప్పుకొనె పురోహితుం;
డీపాటి చాల్ సెబా సనె
పాపయ్య తానొక్క పెద్ద పండితు డనుచున్.

రూకల సంచి దీసి, పెద రుద్రయ బిల్చి
పదార్ పదాఱుగా
ఆకవు లొక్క రొక్కరికి
నప్పణ వెట్టు మటంచు రెడ్డిగా
రే కరమందు నుంచి, యొనరించిరి
గౌరవ, మంతతోనె, చా
మీకర భూష లిచ్చినటు
మేనులు పొంగి నుతించి రందరున్.

ఇన్ని పొగడ్తల నా నర
సన్నకొడుకు పెద్ద పేరు సంపాదించెన్,
కొన్ని దినాలకు దస్తము
సన్నవడం జొచ్చె, కీర్తిసంపద బలిసెన్.

సర్కారు సిబ్బంది సరిజేయుటకు కొంత,
సాలు జమాబంది పాలు కొంత;
పొరుగూరి మన్నీల సరఫరా కింత,
ఆలేకార్ల లంచాలలోకి కొంత;
పేట పెద్ద వకీలు పిల్లెకు కొంత,
కాంపౌండరు మునుసామి పాలు కొంత;
కోడెరెడ్లకు కొంత, గుఱ్ఱాలకై కొంత,
బగ్గీలకై కొంత, భటుల కింత;

పెద్ద మహడీలు కట్టిన పేర కొంత,
పూటపడి అచ్చువలసిన పాలు కొంత,
తన వివాహాలు నాల్గింటికిని మఱింత,
కొంత కొంతయె ఖర్చు కొండంత యయ్యె.

ఎదిగిన కూతు లిద్దఱకు
నెన్మిది రోజుల పెండ్లి సేతకే
వదలెను వేలు వేలు; నిరు
వాగుల వచ్చిన పెండ్లి బండ్లతో
కదలెను ధాన్యలక్ష్మి; కడ
కాకియునుం దినె నేతి వంటకా;

లది గది పెద్ద పెండ్లి యని
నారు జనా, లది చాలు రెడ్డికిన్.

ఒక పెండ్లాము గతించె దూమున; మఱిం
కోభార్య కాల్జాఱి కొ
ట్టుకపోయెన్ పెదవంకలో, మఱొక
బొట్టుం గట్టిగా నామె, యిం
చుక సంసారము జేసి, కూతు గని,
రెండోసారి కాన్పుం గమిం
చకపోయెన్, సరికొత్త రామమయె
వేసారంగ పుత్రున్ గనెన్.

వా డీ రంగడు, పుట్టిన
వాడు ముసలి ముప్పునందు, వానితల్లియున్
దూడ వయస్సుదె కద, మఱి
నా డేమో వణకుచుండె నార ప్పొకడే!

రొక్కములేక, దర్పము
తఱుంగక, నారపరెడ్డి రూకలున్
గుక్కను గొట్ట రాలు నను
కూతలు విస్మరియించగాక, ఈ
చిక్కుల నేమి దోచక,
వశిత్వము చాలక, చుట్టుజేరి కు
మ్మ క్కొనరించు నాశ్రితుల
మాటలకున్ చెవి జాల వేసినన్.

మఱునాడే పొరుగూరికి
బిరాన తన తలారి వెళ్ళి పెద్దిరెడ్డికిన్
'యరమంచికయ్య' ఆయక
మిరికించిన పత్ర మిచ్చి ఏదో తెచ్చెన్.

ఇక మొదలయ్యె, రెడ్డి
గడియించిన ఆస్తికి కత్తరింపు, లొ
క్కొక మహసూలునన్ ఫలము
కూడ ఒకించుక కమ్మి యయ్యె, నిం
చుక ధరలుం బడెన్, వఱపు
సూపెను, వానలు బిగ్గబట్టె, నె
ట్లిక సవరించ నేర్చు, ఋణ
మింతకు నంతకు మిద్దె లెక్కగన్.

చదలంటు వాములు చదు నయిపోయె,
గాదెల కణజాల గబ్బిలము జేరె;
నాగలోకము దాకునట్టి పాతరలలో
ముగ్గిన గింజలు తగ్గిపోయె
కట్ట గట్టుక నిప్పపెట్టె నిండుగనున్న

పత్రాల దస్త్రాలు పారిపోయె;
ఏ కుండలో జూచినా కానవచ్చు
బంగరు నగానట్ర అక్కఱల కేగె
ఒక్కటే రోజు
మూడు రూప్యముల మణుగు
వేరుసెనగ నాలుగణాల
వెలకు తగ్గె;
ఒక్క రూకకే యిరువదియొక్క సేర్ల
కొర్రలును జొన్నలును
అమ్ముకొనగ వలసె.

పెద్దిరెడ్డి ఒకొక్కటే
పద్దువేసి,
పత్తి నారప్పచేలన్ని
కత్తరించె;
అంటు మిద్దెలు నాల్గు
కృష్ణార్పణమ్మె
కాగ - పసులు జీవా లెద్దు
లాగగలవె?

ఊరచావడిని చేరిరి బాకీ
దారు లందరును
తమ రొక్కమునకు;
ఊరిపెద్ద లీమారు పూర్తిగా
తీరుమానమే
తేలిచి చెప్పిరి

తాడూ తలుగూ
కాడీ మేడీ
పారా పలుగూ
కాఱూ కంపా
చెట్టూ చేనూ
చేరి సమస్తము
కట్టివేసినా
కట కట యయ్యెను.

ఎట్టి ఏగానియే గాని
యివ్వననక,
నల్లపూసలతో
ఆస్తినెల్ల జూపి
కట్టె వడ్డీ మొదల్
కడ బొట్టు వఱకు -
పత్తినారపరెడ్డి
నిబద్ధిమనిషి.

ఏరు చెప్పిరో మఱి
తెల్లవారు సరికె -
పత్తి నారపరెడ్డి దివాల - యనుచు
పసుల పిల్లలు గూడ
దివాల రెడ్డి
అనగ ఊరెల్ల
గప్పున నందుకొనియె.

ఈమాట విన్నతోడనె
రామమ్మ భరించలేక, రామాయనుచున్
ఆమూల చీరె చెఱగు త
నే ముట్టించుకొని కన్యకే యయి పోయెన్.

నారపరెడ్డీ నారప్పయ్యెను
ఊరి మోతుబరి ఉప్పరి యయ్యెను
దారిమోటులో పూరికొట్టమున
చేరెను
తోడొక చిన్నరంగడే.

కుళ్ళి కుళ్ళి యేడ్చి
కుక్కి మంచమునుండి
లేక లేక,
చేయు చేవలేక,
చిన్ని రంగడిచ్చు
చిన్నలోటా నీళ్ళు,
త్రాగి, ముసలి రెడ్డి
సాగి పోయె.

తల్లి దండ్రి లేని,
తనవారెవరు లేని
చిన్నవాని గతిని
విన్నగూడ
బంధుమిత్రకోటి
పదరనైనను లేదు -
సాయపడుట కింక
కాయ మొకటె.

వాడే రాంగాడయ్యెను
పాడా కసవులను దీసి, పసులగాసి, కూ
లోడా యనిపించు కొనెన్
లేడా నారప్ప వీని లేమిడి చూడన్.

ఎన్ని బడబాగ్నులా చిన్ని యెడద
రగులు చున్నవో?
ఎన్ని కార్చిచ్చు లున్న యవియె?

ఎన్ని సంవర్త ఝంఝల కెదురు నిలిచి
వాడి వత్తయి పోయెనో
వాని బ్రతుకు!

ఒకరింటి గాటిలో నూరిన గంజెల్ల
నెత్తిపోయుట కెంత యేడ్చినాడొ!
ఒకరింటి దొడ్డిలో నుండిన కసవెల్ల
నూడ్చివేయుట కెంత ఉడికినాడొ!
ఒకరింటి నట్టింట నున్న కొట్టులనెల్ల
దంచుట కెంత కంపించినాడొ!
ఒకరింట గంపలకున్న రాగులనెల్ల
విసరుట కెంతగా విసివినాడొ!
ఒకరి యింటిలో
పిల్లల నూచుటకు,
మరొక్కరింట
పక్కలు వేయ,
నొక్కరింట
అరవచాకిరీ
చేయుట కొఱకు -
ఎంత యెంత దురపిల్లెనో
వాని యింత యెడద!

కటిక కారము సంగటి
గుటక వడక
ఎన్ని బిందెల నీళ్ళు
త్రావించినదియొ!
ఎండు రొట్టె ముక్కలు
అఱిగింపుగాక
ఎన్ని మిరప గింజల
నమిలించినదియొ?

ఇవియుం దొరకక పుడిసెడు
గవినీళ్ళం ద్రావి ముడుచుక పరుండిన పా
డు విభావరు లెన్నో, లె
క్కవిలేవరి యేది?> వల్లకాటి మనుగడన్.

రంగడు -
తొలికోడి కూత క
న్నులు నులుముకొనును!
పిలిపించగానె, చె
ప్పులు తొడుగుకొనును;
గల గంటమ్రోత చే
తుల మ్రొక్కుకొనును -
వెలుగెక్కగానె పం
టలు చూచుకొనును;

మలి సంజలోన కం
డలు తడువుకొనును;
చలివెట్టగానె ప్ర
క్కలు దాచుకొనును;
నెల ఎక్కగానె గ
జ్జలు కట్టుకొనును;
కల కంఠ మెత్త కో
యిల లూడి పడును -
కల మెఱుంగడు గాని వలపుతుంపురుల
నిలువెత్తువోసి చిన్నెలు సూపగలడు
బళిబళీ రంగన్న
గళమె కావ్యమ్ము.

'కోలుకో' లని కోలగొట్టిన జాలు
జాలువాఱును 'భరతా'లు వేలు;
'ఓ-' యంచు నొక యాల సాయించితే చాలు
జాఱు 'గాథాసప్తశతు'ల శతులు;
'మచ్చుదిగవే' యన్న మరులు పాటయె చాలు
పొదుగు సేపును - 'అష్టపదుల' పదులు;
'గరుడగమనా' యరచు గాత్రమెత్తిన చాలు
పొంచిచూచును 'మూక పంచశతులు' -
వేల వేల పదాల
సామేల వలయు
ఖంగుమనగల గుండె చిక్కనయెయున్న -
వేయిరూకల మాణిక్య వీణయేల?
వెదురు చాలదె
పలికించు పదిలమున్న?

పుట్టుకవి, గాయకుడు,
నటరాట్టు నతడు -
కట్ట తెగగొట్టుకొని
రస ముట్టిపడగ
ఉట్టిపాటున
కన్నీరు లురలి పొరల
చెట్టు పుట్టలకే
గుండె పుట్టజేయు.

ఆ రంగన్నే కాలువ త్రవ్వకానికి పోతూ యాల పాడుతున్నాడు.

వాని తియ్యని గొంతుక లోన లోన
తీగ సాగుచు నున్న దుద్వేగ రవము
వాని చిక్కని గుండియ లోన లోన
పూవు పూయుచు నున్న దుద్బుద్ధ రసము.

వేకువ రేకు

లొక్కొకటి విచ్చుచు నున్నవి;
వేప కొమ్మలన్
కాకులగుంపు లొక్కొకటిగా
తొలిమున్కల కేగుచున్నవి;
ఆ కోకిల ఒక్కటే -
గుబురు కొమ్మల రెమ్మల వీడలేక
కూకూ కుహు అంచు
నొక్కొకట గూయుచు నున్నది
తెల్లవారగన్.

ఆ ప్రశాంత ప్రభాత
సంయాతమంద
మంద మరుదంకురముల
మైమఱచి సొక్కి,
కలతలన్నిటి మఱచి
రంగన్న
కంఠమెత్తి పరిసర ప్రకృతి
మంత్రించి లేపె.

ఆ క్షణమ్మున,
గాన లయామృతమున
లీనమై పోయి
ప్రకృతికి - మానవులకు
నడుమ నున్నట్టి
యవనిక ముడిచివేసి
మధుర నిర్మల
పరమ సమాధి నిలిచె.

జీవితమ్మున
నట్టి రసావబోధ సిద్ధి
ఎన్నడోగాని వాసించబోదు!
వేయి యుగముల
సాధనవిధు లవెల్ల
అట్టి తృటికోసమే
తప మ్మాచరించు.

అటుమీదట నందఱు, మి
క్కుటమగు సంతసము గుండె గూడుగట్ట, ని
ట్టటు కదలక నిలుచుండిరి;
తటాలుమని "పిన్న పెద్ద" దరిసెనమయ్యెన్.

సరి! పిమ్మట మామూలే!
చరచర పారలను బట్టి సాలుమేఱ, కా
ల్వ రమారమి మైలున్నర
వఱకుం ద్రవ్వకము రోజువారి రివాజే.

అంబటి ప్రొద్దు కాగనె
రవంత విరామము గూడ లేక, వా
రుం బరువెత్తి రింటికయి
రొప్పుచు రోజుచు, నంగకమ్ము లె
ల్లం బులకాపుజేసి నటులన్
జెమటల్ జెమటింప, ప్రేవులున్
దంబుర మోతమ్రోయ
నిరత శ్రమదగ్ధు లుదాత్త జీవనుల్.

ఇది రెండవ సర్గ

# మూడవ సర్గ

రంగన్న గబగబా పా
రం గడగా ద్రోసి మొగ, మురమ్ముం గాళ్ళు
ముంగల చేతుల కడుగుకొ
నెం గంగను దెచ్చి యిచ్చు నీటి ముంతతో.

కుండలోని సంగటి నంత గోకితీసి,
మూకటిని బెట్టి,
            మజ్జిగ మునుగ బోసి,
పచ్చిమెరపకాయొక్కటి తెచ్చి యిచ్చె -
ఉదయ భోజన మతని
            కియ్యదియె సుమ్ము.

గంగమ్మ పదారేండ్లది
కొంగు నిలుచునంత వయసుగూడ లేని, దా
సింగారపు బొమ్మే మన
రంగన్నకు బ్రతుకులో చిరత్న రత్నమౌ.

అంగమ్ముల నిగనిగ, సా
రంగమ్ముల లగువు బిగువు రంగుల సొగసుల్
ఖంగున మ్రోగెడు కంఠము
బంగరు బొంగరము పుణికి పట్టిన దపుడే.

రంగు వెలిసిన నీలిచీర చె
ఱంగులకు సొరుంగడించి, తు
రంగలించు కురంగనయనా
            స్నిగ్ధ వర్తనముల్;
చెంగు చెంగున చెంగలించి, బె
డంగు సొబగుల రంగలించి, వి
హంగ భంగుల వింగడించు - ల
            తాంగి చందమ్ముల్.

సిల్వరు కడియాలే ఆ
చెల్వకు సొగసులను గూర్చె -
            చెవుల బెండు గ
మ్మ ల్వయ్యారము మిసిమి పసిమి
            కలకలలాడన్.

చెండుమల్లె చాలు
            నిండుదనమ్మిచ్చు
కొండగోగుచాలు
            దండి దండి!
వెండి బిళ్లచాలు

వెలుగుల విరియించు
కొప్పులోనె గలదు -
గొప్పదనము.

తిప్పలెన్ని పడిన,
ముప్పుల మున్గిన
ఉప్పు పప్పు లేని యునికియైన,
కప్పురంపు టెడద
కమ్మని తలపులు
నిప్పువంటి బ్రదుకు
గొప్పనిచ్చె.

అమ్మలేదు,
నాన్న అంతకంటెను లేడు;
కొమ్మలేదు, పట్టు గొమ్మలేదు;
నిమ్మళమ్ముగ నెట్లొ
నెగడించె జీవిక
సొమ్మసిలక
బాప జూచువఱకు.

అక్క, బావ పిదప
నల్లారు ముద్దుగా,
సొంతపిల్లలాగ జూచుకొనిరి;
తమకు పిల్లలేల?
తలిదండ్రులే, తా
మటంచు పెంచినారు, మంచివారు.

చాకి, సంతరించి
చదువు చెప్పించిన
బావ యెద్దు పొడిచిపోవగానె,
అక్క గడ్డిమోపు
లమ్మి పోషించెను
లేమియేమి సేయు ప్రేమయున్న?

మగవాడు పోయెనే యని
పొగలుచు గంపంత దిగులు పొడుచుచునున్నన్;
మిగులో సగులో తా దిని,
తెగించి చెల్లెలిని సాకె దేవమ్మొకతే
అక్కదేవమ్మ దేవత!

చిక్కులెన్ని నొక్కు చున్నను,
చెల్లెలి జిక్కనీక,
మిక్కుటమ్మగు మక్కువ
రెక్కవట్టి నడుపుకొని వచ్చె
తక్కువన్నదియె లేక.

పేదరాలు గనుక,
పేదకుటుంబము చిదికి
నిలిచినట్టి చిన్నవాని,
వెదకి వెదకి,
కడకు వీని రంగన్నను జూచి
పిల్లనిచ్చి చొక్కి పోయె.

గంగమ్మకు రంగన్నకు
సింగారముజేసి, పెండ్లిచేసిననా, డా
యంగనకనులన్, మాలిమి
పొంగులు రంగులను సూపి పూర్ణత నందెన్.

మాలిమి తాలిమిన్
గొలుచు మానము లేదు;
కులాద్రులం దలం దాలిచి
సప్తసాగర వితానము నీదుచు
కల్పముల్ తపఃపాలన సేయనీ,
ఎడద బాకుల పోటుల బ్రువ్వనీ -
వసంతాల, వనాల,
పూల పవనాల
విలాస విహారమే యగున్.

పెనుబలము గలది మక్కువ
తనుదానై తన్నుదాను తఱుగు
కొనుటకున్
వెనుదీయనీదు, నిన్నెం
తె నిరామయ దివ్యకర్మ నిష్ఠునిజేయన్.

అనురాగ హీన జీవిత
మనయము నిన్నడచి పుచ్చు నతిభారమ్మై
నిను నన్ను చేయిగలిపి, ఆ
వని మాఘవనిన్ బొనర్చు వలతి యదొకటే.

రంగన్న గంగమ్మ
రంగురక్తిమలు
రంగన్న గంగమ్మ
నింగి నీలిమలు.

రంగన్న గంగమ్మ
సింగారములు జిమ్మ
రంగారు బంగారు
పొంగారు గోపురాల్.

రంగడంటే ఒక్క గంగమ్మ మగడె -
గంగమ్మ అన నొక్క రంగన్న పడుచె.

రంగన్న బ్రతుకెల్ల గంగమ్మ బ్రతుకె
గంగమ్మ మనసెల్ల రంగన్న మనసె.

రంగని గంగన్నాయని,
గంగమ రంగమ్మయనుచు గ్రామప్రజలున్
భంగుల భంగుల పిలుచుట
కంగారునెకాదు, వారి కలయిక దెలుపున్.

గంగమ్మ నలనల్ల
　　　గాజుల రవళిలో
గంగమ్మ అఱనీలి
　　　కన్నుల మగతలో
రంగన్న రుచిచూచు
　　　రాగుల అంబలే
హంగైన భక్ష్యభో
　　　జ్యాల మరపించున్.

చూపులేగాని,
　　　మాటలజోలిబోక;
వలపులేగాని,
　　　వాంఛల వంకబోక;
పనిత్వరలెకాని
　　　సరసాల పాలుగాక -
గబగబా ముగియించి
　　　రంగన్న వెడలె.

కొడవలి పగ్గము చేకొని
నడచెన్ రంగన్న, కొండ నడుమకు ప్రొద్దున్
గడచుచు నున్నది, రావలె
వడి వడిగా - మోపు మేత వట్టి మాటలా!

ఊరికి చేరువనే గల
దోరగ ఒకకొండ, దాని దొరువుల వెంటన్
చేరగవలెనెత్త, మ్మా
చేరువనే పెద్ద యడవి చిక్కగ నుండున్.

ఒకడా యిద్దఱ! చాలమంది,
తమకెంతో కొంత
ఆపూట జీవికకుం దోడ్పడునంచు
వత్తురు సరే!
వేయేండ్ల కొక్కొక్క వానకదా!
అక్కడమాత్ర మెట్లు గఱకైనా పుట్టు?
ఏ పాతచెట్లకుగానీ చివురేది?
పచ్చనలు తాటల్ దీసినా చూడమే?

చినుకులు పడనే పడితే
అనుమానములేదు గ్రామమంతా సాకున్
వెనుదీయదుమల! కావల
సిన వన్నియు నడవిలోన చిక్కును సుమ్మీ.

కానీ యెపుడో, ఎచటో
నానుపు వానైన పడిననాళ్లన్, కొండల్
వేనలి విరియన్, మిన్నుల
చానవలెన్ గానబడును చాయలుదేలున్.

కాసేపు రాల్చిన గంపల కొలదిగా
కమ్మనికలివిపం డ్లమ్మవచ్చు;
కొంతసేపేచాలు కొల్లలు కొల్లలు
బలసకాయలు గంప బట్టవచ్చు;
ఇంతసేపే చాలు నెన్నైన రేణగా
యలు కోసుకొని అమ్మనైనవచ్చు;
ఒక యింతసేపు నోపిక గోసుకొన్న చాల్
సీమచింతలు వడి జేర్చవచ్చు -
వీని యాదరువున
ఊరిలోని పేద
చాన లెందఱో,
ఆనాటి సారమునకు
చాలినంత గడింతు
రా కాలమందు
కాయకసురుల కేమి!
చాలాయె దొరకు.

తిండికి చాలని కక్కుఱితిం
డాపల వెలుపలనక
తేపతేప కొట్టండసిలెను
చిక్కని కొండ యడవి
అగ్గిపడుట కొంత నశించెన్.

తేనె తెట్టెలతో చాలు
తెలిసియున్న చాల
సాధించవచ్చు;
నచ్చుటి రకాల ఆకులే చాలు
కొందటి ఆకలణచు;
టేకులే తీర్చు
కొందఱి పీకులాట.

మడక మొదలు
కాడి మానుదాకా,
గొఱ్ఱుతుంట మొదలు
మేడితోకదనుక,

బండి కుండ మొదలు
బారు నగలదాక -
కొండలోనె
దెచ్చుకొనగ వలయు.

కాని, ఇవన్నీ - పేదల
నోనాడిన పెద్దవారి నోటవడియె, నిం
కే నాయము సెల్లదు, నీ
వా నాయనగారి శరణమనుటే తప్పన్.

కావలివారి కన్నుగవ గప్పి,
ఒకప్పుడు పట్టుకొన్న
నే పావలొ అడ్డగో
వదలు పట్టు నెఱింగి,
మఱింత తప్పినన్
చావడిలోని కీడ్చుకొని చన్న
సరే అనుకొన్న వారె
ఏదో విధిలేక పోదు,
రదియున్ కొడవంటిని
దోచు నెప్పుడో.

కానీ తప్పనిసరియై
ఈనాటికి గూడ కొందఱట్లే వీడున్
కానకు బోవును, చుట్టఱి
కానికి దాయాది తాను గ్రామస్థులకున్.

గడ్డిమోపు దెచ్చు,
కాకున్న గట్టెలమోపు దెచ్చు,
నదియు నోపకున్న -
మొద్దుకొట్టి తెచ్చి
మునియప్ప కమ్మును,
"మడకొ బడకొ ఏదొ
మిడుకు" మనుచు.

పొలము పనిలేని
రోజులప్పుడు తనెట్లొ
బ్రదుకవలె మఱి!
కూలికి ప్రాలుమాలి
కాదు; పనియేది?
ఏడాదికంత కొక్క
మూడు నెలలే పనుల్
కడముట్టు టెట్లు?

దొరికిన గడ్డీ గాదము
బరబర కోసుకొని

గోగు పగ్గము బిగియిం
చి, రయమ్మున నడి ప్రొద్దున
విరవిర లాడుచును వచ్చి
వేసెన్ మోపున్.

ఎఱ్ఱటెండ ప్రొద్దు;
ఏడు మూరల గడ్డిమోపు మెడలపైన;
మూడుమట్ల లోతు కనులు;
పొట్టలో వీపు జేరెను -
వగడు వోలె నతడు
వణకు చుండె.

ఆ నిమిష మతని జూచిన
ఏ నరమానవుని గుండెయే యయినన్, లో
కానికి శాపమిదేయని,
వేనోళ్ళను విచ్చి యేడ్చి విఱవిఱలాడున్.

గిరగిర కన్నుల నీరుం
దిరుగగ, గంగమ్మ చెఱగు దీసి యొత్తుచున్
చరచర లోనికి వెళ్ళెను
పురుషుడు తనకంటి నీరు పోల్చు నటంచున్.

మగడు కొండకు బోయిన
మరు నిముసమె
గబగబా లేచి గంగమ్మ
గవిని వారి
వడ్ల దంపకమున
దనవంతు, తవ్వ
ముగ్గు చెన్నంగి వడ్లు
ముమ్మారు జేసి -
చేట నారబెట్టి,
బాటమీదే యున్న
చక్క రోటిలోన
చక్కదంచి,
కుండ యెసరు వెట్టి
కుతకుత మనిపించి,
చింతకాయ దంచి,
పొంత నింపె.

పొంతనీళ్ళు దెచ్చి,
రవంత వంగి నిలుచుకొన్న
రంగన్న పైనిమిరి, నిమిరి
కడగుచున్న
ఆ యిల్లాలి కరయుగమ్ము -
వేయి సంజీవనుల

మేళవింపు సుమ్ము.

ఆ నిర్మల ప్రేమ
హస్త సంస్పర్శతో
మానిపోయిన వేమొ
వాని గాయములు;
లోని ఒక్కొక్క యెముక
హూనమై యున్న
వాని తీపులు కొంత
వదలినట్లయ్యె.

ఇన్ని యిడుములు
నీకోసమే భరియించుచుంటినని
ఆతడనడు;
నీ సుఖము కొఱకె
బ్రదుకుచుంటి నటంచు
ఆమె పలుక దెపుడు;
మాటలేటికి
మనసులో మరులు పొరల?
అతని యడుగుల చప్పుడే
ఆమె మొగము నింత విప్పార్చు,
మాట రవంత విన్నజాలు
కన్నులలో వసంతాలు విరియు
చూసెనా యిక -
నిలువెల్ల చొక్కిపోవు.

మూడు నాలుగు మాటలే
మూడువేల ప్రేమ గీతాల
ఆవేగ సీమ దాటు
హృదయములె
మాటలాడుకో మొదలు వెట్ట
నాల్క నటునిటు
కదలించు నాథు డెవడు?

చూపులతోనే వలపుల
రూపు దిద్దు కొనుచు,
ఆ పడంతి బువ్వబెట్టె
దాపున గూర్చొనుచు.

ఇది మూడవ సర్గ.

## నాల్గవ సర్గ

గబగబ బువ్వన్
నాలుగు కబళమ్ములు మ్రింగి,
రెడ్డిగారింటికి
రోజు బరాతము రాగా
కడవ బుజానం బెట్టి
ఊర బావికి వెడలెన్.

పోటు కడవ;
గుండెపోటు వచ్చును
నింపి యెత్తుకొన్న మాత్ర;
ఇంక నేడు మట్ల లోతునుంచి
మెట్ల నెక్కుటయన్న,
నెంత కండయున్న, నేమి చాలు;

ఎన్ని కడవలు పోసిన
నెంత పెద్ద ఔతుఖానాయొ కాని,
పైకైన రావు;
అన్ని నీళ్ళేమి సేతురో ఉన్నవారు;
పాపము;
          ఆ రంగనికి బోధ పడనె పడదు.

మాటయేగాని వీరిచ్చు మూట లేదు;
ఏటి పట్టెల పాలన్న దాటిపోయె,
పూట కొక ముంత మజ్జిగ బోతు రంతె -
పేదవాని కదే అమృతోదనంబు.

కూరనార వాని పేరైన తెలియదు
మెరపకాయ కంటె దొరకదేమి
ఉల్లగడ్డముక్క, చల్ల -
          ఇవొక్కటే
సాదమందు,
          వారి సాధకములు.

దేవళాలు తిరుగగానె
బావి సేవ మొదలు;
దోవ అఱిగిపోయి, గుండె
చేవ దప్పు వఱకు.

మఱి యిరస వడ్లు, రోకలి
దరిసెనమయ్యెన్; సరే
ఎదల్ పగులగ
నా వరుస ముగించెడు సరి

కస్తురవిప్రభ
ఊరి నెత్తు సంద్రము జేసెన్.

లాందరాలు తుడిచి,
లాంపులు ముట్టించి,
మిద్దెమీద వరుస మిగులకుండ
మంచములను వేసి,
మనిషెత్తు పరుపులు
దులిపి, పరచి, దోమతెఱల గట్టె.

ఈ యింట నున్నంత సేపు -
కోయన్న కోటి సామాను;
ఈ యిల్లు దాటితేనేమొ -
రాయెత్తితే రాయి నీను.

ఈ యింట నేమూలనైన
చేయి వెట్టిన రాల్ వరాలు;
ఈ యిల్లు దాటితేనేమొ
వేయంచులన్ దెగు నరాలు!

ఈ యింట నేపెట్టెనైన
ఈయూరి సిరులెల్ల పూచు;
ఈ యిల్లు దాటి పారాడ
ఈ యూరి కడగండ్లు వేచు.

ఈ యింటిలో తొంగిచూడ
ఈ యూరి చెమట నీరాడు;
ఈ యూరిలో తొంగిచూడ
ఈ యింటి భూతమ్ము నీడ.

ఈ యింట చలువఱా
లిమిడిచి చెక్కిన
నేలపై నీనీడ
వాలుదోచు;
ఈ యింట నున్నట్టి
యిటుల గోడల, పాల
గారలో అద్దాలు
కలసి పోవు;
ఈ యింటి మహడీల
నెక్కిన చానల
వేనలిలో మబ్బు
సోనలూరు;
ఈ యింట దిరుగాడు
నింతపిల్లియు, నూరి
పెద్ద రైతుల

నిలవేయ జాలు -

ఇచట త్రేన్పులెకాని విన్పింప వూర్పులు -
ఇచట రూకల గల గల లెత్తిపోవు;
ఇచట లక్ష్మి సరస్వతులే వసింతురు -
ఇచట లేనిది - మానవ హృదయ మొకటె.

ఈ యింటి యజమాని
ఎంతో విద్యావంతు
డెపుడు భాగవతమ్ము
నే పఠించు;
ఈ యింటి యిల్లాలు
పూయించు గన్నుల
కొల్లలు కొల్లలు
మల్లెపూలు;
ఈ యింటి కొడుకొక్క
డింగ్లాండులో, ప్రజా
స్వామ్య శోధన నెంతొ
జఱిపి వచ్చె;
ఈ యింటి కూతురు
పోయిన యేడె,
సాంఘిక శాస్త్రమున
పట్ట మొకటి గొనియె;
ఎచట జూచిన చిత్రాలు
నెన్నొ శిల్ప ఖండములు గనిపించు,
నెక్కడను మలిన మన్న దేలేదు -
కాని, సంపన్న గృహము
చొచ్చి చూచిన
నాత్మయే
శూన్య మిచట.

మున్నూరు మట్టి మిద్దెల
క్రొన్నెత్తములెల్ల దీని కొత్త యరుగులం
దన్నగలే విది యొకటే
ఉన్నది ఊరెల్ల మ్రింగి యుబ్బినట్లుగన్.

కోటి కొక్కరిది ఇ
చ్చోటి రాయలసీమ;
పేట కొక్కెడలేని
పెద్ద రాయలసీమ;
వేటాడి వేటాడి
వెదకినా ఇందులో
నేటి పేదల సీమ
నిజరూపు కనబడదు.

ఇది ఎడారిలోని ఒయాసిస్సే కానివ్వు
వడగొట్టిన పేదకేమొ వట్టి ఎండమావు.

ఇంత ధనమున్న
చదువున్న
నింత బలగమున్న
నీయింట నెవరికి సున్న హాయి;
ఒక్కొకరు నొక్క లోకము -
ఒక్కరి దొకొక్క తీరు -
నెయ్యము లిచట
ప్రాదెనుగులయ్యె.

ప్రొద్దు పోకకె చదువు
ప్రొద్దు పోకకె నులివు
ప్రొద్దు పోకకె మెదుకు
ప్రొద్దు పోకకె బ్రతుకు.
మొద్దు వాఱెను మనసు
మొద్దు వాఱెను తనువు
మొద్దు వాఱెను బ్రదుకు
సుద్దియే యిచట -

ఎటు చూచినా
ప్రక్కలెండి యున్నారు
ఎటు చూచినా
విలాపించు చున్నారు
ఎటు చూడలేక
తమ కిటికీలు మూసుకొని
కటు జీవిత -
యధార్థ కథ చూడకున్నారు.

చుట్టుం జుట్టు
దరిద్రతా విధుర సంక్షుబ్ధ క్షుదంబోధిపై
తెట్టుంగట్టు నుఱుంగు కొంపయిది,
బోదెల్ పాదులున్ గుళ్ళై;
నీ పుట్టిన్ మోసెడువారు పీన్గులయి
రేపోమాపో చానుండ
వీ రెట్టున్ నిల్వరు, చూచుకోరు దరులు -
అట్లే చుక్కలన్ జూచుచున్.

దారుణ కల్మష
దగ్ధ మారుతో
చ్ఛాన రోదసీ
క్షుద్ర భూమిపై,
ఘోర నారక
క్రూర జ్వాలా

ఘూర్ణమాన సం
చూర్ణమాన, బా
ధాధరా ధరా
ధిత్యకపై, జం
బూక రోదనా
పూర్ణ శ్మశాన
కాష్ఠచ్యుతాస్థి
కా శిఖరముపై,
ఎట్లు నిలుచు నీ
కృత్రిమలోక,
మ్మెట్లు నిలుచు నీ
కృత్రిమజీవ,
మ్మెట్లు నిలుచు నీ
కృత్రిమ హృదయ
మ్మిట్లిట్లే చిట్లి
పెట్లి పోవును.

పరిసరాలు దరిద్రతా
పరిదగ్ధము కాగా,
సరి నరాళి ననరాలన్ని
పురుగుబట్టి పోగా,
ఉరికి ఆర్పలేక పురుగు
తరిమి వేయలేకా
ఉరిమి చూచుచుంటి వట్టి
దరి బేసితనమ్ము.

ఎచటికో పోవుచుండి,
కాసింత సేపు
ఆగియున్నట్లు లుందు రీ
ఆస్తి పరులు,
పలుకరించ రెవ్వారి
సంజ్ఞల వెలార్చి
ఉత్తరువులిత్తు రంతియే
ఊడిగముల.

ఇంటి ముసలమ్మ మాత్ర
మా పెంట దరిని
కుక్కి మంచమ్ములో, పండు
కొని, ఒకపుడు
రంగనిం బిల్చి మాటాడు
పొంగి పోయి
వీని నాన్న నెటింగిన
వెట్టి దామె.

పని ముగించి రంగ

డనుదిన వర్తన
పుల్లగూర కొంత చల్ల కొంత
తీసుకొని, రవంత
తెలిపి వచ్చెనటంచు
ఇంటి ముఖముపట్టె నిట్టివోలె.

మాటు మణిగిన దూరు,
నిర్మానుష్యములు దారులన్నియు
చాకలి గేరిలోన మటుకు
మగని గుద్దులుతిన్న మల్లి యేడ్చు -
ఊరకుక్కలు మాత్రమే
ఊరడింప.

చీకటి ముంచివేసినది
చింతల పల్లెను;
గుట్ట కొంప ముందే; కడలేని జాలు -
అడుగు దీసి ఒకించుక
ముందు వేయుటే
నాకము నెక్కు నంతపని!
నాలుగు బారల కొక్క గుంతో మిట్టో
కనిపించు;
వాడుక నెటో నడువన్వలె
మెల్లమెల్లగన్.

గూటిలో దీపముం బెట్టి,
నోటిలోన
కబళముల బెట్టుకొందురు
గ్రామజనులు!
అంత చుక్కల వెలుతురే
యైన జాలు
వారి కనులకు గనిపించు
వస్తు తతులు.

అసలు దీపము ముట్టించు
నంగణమువలె
చాల తక్కువ;
ఉన్న దీపాలుగూడ
తమ్ము దాము
జూపించుకో దగిన జాలు
అన్ని వస్తువులన్
జూపినంత ఫలము.

ఒక్క కోమటి సుంకన్న,
ఒక్క బట్ట లచ్చుమయ్య,
పంచాంగము రామశాస్త్రి,

ఒక సరాబు వీరాచారి,
ఒక్క భజన గురువు -
- వీరిండ్ల లోననే
ఉరువు దివ్వె.

ఊరి ముందట
కరణముగారి విడిది;
ఊరి కాదట
రెడ్డిగా రున్న మేడ;
ఉన్నవని తోచు రాత్రులు;
నూరు మొత్త
మంధ కారాంతరమ్ములో
నావులింప.

వేకటి చీకటి, ఆకటి
కూకటి విరియించి రాత్రి
గుబగుబ లాడున్.
మూకటి పగిలిన బ్రదుకులు
రోకటి మనుగడలు మాత్ర
రొప్పుచు నాడున్.

అక్కడక్కడ
నొక్కొక్క ప్రక్క సందు మోటులో,
మాటులో,
ఔప్పపాటు నిలిచి -
మోటు జీవాల
తొందరపాటు గన్న
నేటి బ్రదు కిదియని
ఏవగింపు గల్గు.

దయ్యమ్ము వోలె చీకటి
గొయ్యిని ముసుగుం దగుల్చుకొని, ఒక్కండా
వయ్యారి బసివి గొట్టము
కొయ్యం గదలించె, కుక్క కొయ్యో మనియెన్.

వామి దొడ్ల లోన
దోమల గుంపులో
పాముపుట్ట ప్రక్క
పండుకొన్న
పసల పిల్లవాడు
భయపడి, ఎనుముల
ప్రక్కజేరి, తోక
బట్టుకొనియె.

దుబ్బ నాగిరెడ్డి

దూడ రాలేదని
వెదకబోయె, దొరువు
పొదలలోన;
గూని సుంకిరెడ్డి
గొడ్డు, బందెల దొడ్డి
లోన పడినదన్న
వ్రానువడియె.

రచ్చకట్ట మీద
రామన్న సుబ్బన్న
వఱపు తప్పదనుచు
వంతపడిరి;
బోయ చిన్నిగాడు,
బొరుగుల రంగమ్మ
అప్పుపెట్ట దనుచు
నఱచు చుండె.

సుంకలమ్మ, పసుల
చొప్పదీయుచు నుండ,
తేలుగుట్టె నెడమ
కాలిమీద;
మంతరించమనుచు
మరియప్ప దఱికేగ,
గొట్టె చచ్చివాడు
గొణుగుచుండె.

సంతలోన సరుకు
దొంతర నెత్తించి
బండిలోన వచ్చు
బద్దరయ్య
వల్లలేని యెద్దు
వాటు వేసిన గొంతు
చించుకొనుచు నుండె
చెడితి ననుచు.

సందు మూల గుంపు;
కందిరీగల వోలె తిరుగుచున్న వారు;
బరువు గొంతు;
కడుపు తఱుగు నేడ్పు,
కళకళపాటులు -
రంగడేమి టనుచు తొంగిచూచె;

ముసలిదేమొ మంచముం బడి మూడేండ్లు
రాత్రి గడప దనెను రామదాసు
ఇంటి మనిషి నాగి ఈరోజు కన్నది

ఆకు చేను బోయె నంట వాడు.

పురుగు కుట్టెనంట;
నరసన్న నోటిలో నురుగు వచ్చుచుండె;
సొరుగువచ్చె;
నోటి కొక్కమాట;
బాట పల్లెకు వెళ్ళ;
మంత్రగాని దెచ్చు మార్గమేది?

రొమ్ము గొట్టు కొనుచు
రోదించు నాగిని;
వట్టి మాటలాడు
వారి జూచి;
నేను పోయి మంత్రగాని
దెత్తు నటంచు
ముంత నచటబెట్టి
పొంత బట్టె.

"పాము గఱచెను
నే డమావాస్య గూడ,
కష్టమే" నని రామయ్య
కట్టమీద గూరుచుండి
అనెన్ పోవువారితోడ
ఆకుమూటలో నున్న
పొగాకు దీసి.

మాలపున్నమైన
మరుసనాడే కదా
పాము గఱచి చచ్చె
రాముడనుచు,
సాలె నారణమ్మ,
చాల విచారించి
కట్లపొడిని నోట
గలుపుకొనియె.

రంగ డొక్కక్కటే విని
రగులుకొనుచు
చెంగు నెగబెక్కి,
బర్రైన చేతలేక,
ఆ తమోగర్భమున బడి
అరుగుచుండె
భయము తోచదు కర్తవ్య భారమున్న.

కన్ను పొడుచుకొన్న
కనరాని చీకటి

పురుగుపుత్ర యిచట
            పుట్ల కొలది;
అసలువాడు, దారి
            నైన చూచుటలేదు
కలదు దృష్టి
            మంత్రగాని మీదె.

గుండెతీసిన బంటైన
కొండదోవ, కనుమదాటి,
చీకటిపడి చనుటయన్న
ఒప్పుకొన లేడు;
కాని, ఆ ముప్పు జూచి
తప్పుకొనలేదు
            రంగని గొప్ప మనసు.

కళ్లలోన మెదలు
గంగమ్మ సంగతే తట్టలేదు;
రంగడుట్టిపాటు పయనమయ్యె
రెండు పరువుల పల్లెకు;
ఎద కరంగునప్పు డేది నిలుచు.

ఊరు మండిపోవుచున్న సరే!
రెడ్డిగారి మేడమీద
భారతమ్ము,
రాగశయ్యతో పురాణమ్ము సెప్పును
రామశాస్త్రిగారు
రాత్రి రాత్రి.

ఊరిబయటకు వినిపించుచుండె
నతని పెద్ద గొంతుక,
ఊరెల్ల దద్దరిల్ల;
"తనకు తోడయి వచ్చును ధర్మమొండె"
అన్నమాట ఒక్కటె
కొండ అనువదించె.

ఇది నాల్గవ సర్గ.

## ఐదవ సర్గ

అంబటి వా
రటుకులు దంచం బిలిచిన వల్లెయని
బ్రసాపడి
మధ్యాహ్నంబే రంగమ్మ చనెన్
కంబము బోల్
రోకలొకటి గైకొని వేగన్.

అటుకుల దంపకమ్మన
మహాశ్రమ దాయకము -
అగ్గిరేగు గుప్పిట.

ఉడికించి వడ్ల, నొకపెద్ద పెనమ్మున వేసి
రోటిలో పిటపిటలాడ దంచవలె;
పీకల మీదుగనుండు;
నల్గు రొక్కటి తరువాత నొక్కటి
చకాచక పోటులు వేయగావలెన్.

చేతులు బొబ్బలెక్కె,
నలసెన్ బదముల్, దగవుటె
గుండెలున్ కూతలువెట్టె
రక్తము రగుల్కొనె.

ముక్కుల నూపిరాడుటే
మోతగనుండె,
కన్ను లరమోడ్పులకుం దగవయ్యె.

జెప్పపాటే తడవైన
రోకలి పెరిల్లను,
రెక్క శరించు తక్కునన్.

చేయి మార్చి మార్చి
చేతి కొలది దంచె
ఒక్క క్షణము గూడ
నూర కొనక;
మూడు పెనములందు
మూలుగు ధాన్యము
వరుస మీద వరుస
వచ్చుచుండె.

నిప్పు చెఱగు నెండ
దుప్పటే పైకప్పు
మూడు ప్రొవ్వులందు
మొద్దుమంట

వాయిమీద వాయి
　　　　వడి దంపక మ్మింక
చెప్పనేల వారి
　　　　తిప్పలంత!
నలుగురిలోకల్లా
గంగులు చిన్నది, దూడపిల్ల
కోమలమ్ముగా
కలకలలాడుచున్నది -
విలవిలలాడెన్
పెనాన పేలగింజయై.

దగవుట్టుచున్నదని
వేరుగనిలిచిన, తోడివారు
రుంజుకొందురన్ దిగులున
నెట్లో పండ్లన్ బిగబట్టి,
కరమ్ము నెత్తి
బిరబిర దంచెన్.

అందులో నొక్క
పెద్ద ముత్తైదు వీమె
తన కలాటనుజూచి జాలిని వహించి,
'అలత దీర్చుకోవే పిల్ల!' అనెనుగాని
బింకమున దంచుచున్నది
పెద్ద ప్రొద్దు.

ప్రొద్దు మునింగెగాని పని పూరితిగాదు;
ఒడలున్ వశమ్ములో కద్దని చెప్పలేము;
తనకంటె బలమ్ము జవమ్ము గల్గువా,
రద్దరి యెండుటాకులటు
లల్లలనాడగ!
నేవళమ్ముగా
సుద్దుల ముద్దులం బెరుగుచుండిన
తానిక ఓపగల్గునా?
'ముంతెడు గింజలైన
మన భుక్తికి చాలును;
నేను దెత్తునా యింత;
రవంత పై పనులనే
సరిపోవును వెచ్చ;
మింతలో నంతకు నింతకున్
బరువులైన పనుల్ తలవేసుకోకు',
మంచెంతగ మామ జెప్పిన,
తనే వినదాతని తోడునీడయై,
మామ మాత్ర
మూరక క్షణమాత్ర ముండలేడు గద;
కోడితో లేచి,

వాడవాడ మాటు మణిగిన దాక
చెమ్మటల నోడ్చుచుంట జూచి
తనెట్లు కూర్చుండ గలదు!
నల్తుము వడ్లు పెండ్లికని
నాగుకు తెచ్చిన వట్లె యుండె;
కుప్పల్తను గొట్టి తెచ్చినది
వల్లెకు చీరకు చాలదయ్యె;
ఆ కొల్తల కూలి
కొట్టమునకున్ సరిపోవనిదయ్యె;
ఇంక తానల్త యటంచు
నెట్టులను నాయమ
మామ యవస్థ జూచుచున్.

దాపటికమ్ము లేదు,
తను దానయి చిక్కుల నన్ని జెప్పు,
చూపోపమి నేరు దప్పిన
నెదో ఒక చీర ఉగాదినాడు,
తానే పనిమీద వెళ్ళినటులే చని
తీసుక వచ్చు;
కంటిలో పాపగ తన్ను జూచు;
తన పాలిటి దేవుడు మామ యింతకున్.

తానయి చేతనైన పని
తప్పక సేయదలంచె గంగులు,
ఆపైన, ఒకొక్కనాడు
తన ప్రాణము సొంపకయున్న
లోనలోనే నలతన్ బిగించుక
పనిన్ విడనాడదు;
మూడు ప్రొద్దులున్
లేనివి ఉన్నవేవి కదలింపక
బువ్వను బెట్టు మామకున్.

తనకేమో నెలనుండి పై దిరుగు
పొంతంబట్టి నిల్చుండి పోయెనుగానీ -
పదినాళ్ళనాడు తన కేమేమయ్యెనో;
కండ్లులేవన చీకట్లు గ్రసించె కొట్టము;
శిరోభారమ్ముతో ప్రొద్దుగ్రుంకినదాకా
పడియుండె;
నద్దది మొదల్
గీపెట్టు కర్ణమ్ములున్.

సందకాడ జొన్న
సంగటి గెలకంగ
తెడ్డు చూరినుండి
తీయుచుండ,

మసక గ్రమ్మి పొయ్యి
మంటలో పడబోయి
మల్లి, పట్టుకొనగ
మనిషి దక్కె.

మడికలుపు లప్పు డిట్లే
తడిపచ్చిక గోసి,
మోపు తలనిడి తెచ్చెన్;
తడికకు మోపానించుచు
పడిపోయెను,
సుంకులమ్మ ప్రాణము నిలిపెన్.

నిమ్మకాయ బొప్పి,
నెమలీక, జీలకఱ్ఱయును
తేనె రంగళించి
నాకు మనెను;
దాన నాల్నాళ్లు బాగుండె;
బొట్టులేక తేనె పుట్టదిపుడు,
మొన్నరాత్రి,
కడుపు సన్నసన్నగ జొచ్చి,
తెల్లవారుజాముకల్ల హెచ్చి
చుట్టజుట్టుకొనుచు
తట్టుకోలేక
ఎంత లపరించినదియొ దైవమెఱుగు!
కానీ లేత వయస్సుది!
లోనున్న ఒకింత బలిమి రోజు రోజుకున్
కానల వట్టుచు నుండె, జ
గాన నిగారమ్ము నిగ్గు కలదె లేమిడిన్?
పలు కడగండ్ల గాసిలి,
యవాంతర భేదము మ్రింగికొంచు,
నా ఎల జవరాలు
మామ గనిపించిన పొంగులువారు
పోడుముల్ పులకలు గూర్ప,
నన్ని వగపుల్ బొయివెట్టి
శ్రమించుకొంచు,
రోజులు గమియించుచుండె
తల సూపెడు కోర్కులు
తీవ సాగగన్.

తానొకనాడు, సందు మొన
తక్కువలో
నొక మట్టి మిద్దెనో దేనినో
వేసుకోవలె!
పదింబది రెక్కల వంచి యెట్లొ
బాకీని తెగించి తీర్చవలె;

కేరుచు త్రుళ్ళుచు నుండు పాపనిన్
తానయి మామ కిచ్చి,
సులతానువు! నీవని
చెప్పగావలెన్.

ఈ మాట దోచినపుడా
కోమలి చెక్కులను బూసె కుంకుమ పూవుల్
గోముగ మోమిడి మామను
మామూలిమ్మనుచు నడుగ మానసమయ్యెన్.

తటుకున దోచె
నా పగ లతండొక యించుక తల్లడిల్లి,
వేసటపడి తొందరన్
కొలది సాదముతో జనె
బావి సేవకన్
గటుతర భావము;
ఆ ముగుదకాల్వడకెన్,
మెయి చెమ్మటించె,
నొక్కట కనుచీకటుల్
తలమొగన్
సుడిగాలిని ఱేపె గిఱ్ఱునన్.

'పడె పడె' నంచు నందఱు
గబాలున చేతులనున్న
వచ్చుటే దడదడ వేసి, చుట్టుకొని,
'దయ్యము పట్టినదేమొ?
వాత మొక్కెడ గనిపించెనేమొ?
వెనుకే గలదేమొకొ మూర్ఛ?
కుప్పగా బడు పసిపిల్ల లుందురె?
విపర్యయ మియ్యె' దటంచు నెంచుచున్.

మొగమున నీరుగొట్టి
పదముల్, కరముల్, ముకుగంబ
మంత చల్లగ గనిపించినన్
బసపు, రాగుల పిండియు రుద్ది,
వేడిగంజి గుటకవేయనిచ్చి,
మతి జేకుఱునంతకు వీచివీచి
కన్నగవను విచ్చినన్
మనసు నూఱట జెంద
అనంత తృప్తితో.

ఇరు ప్రక్కల నిద్దఱుగా
తరుణిం బట్టుకొని,
సందు దాటించుక వచ్చిరి
కొట్టమ్మునకు -

అక్కడ పురులెక్కిన చీకటుల్
గుబుల్కొనుచుండెన్.

ప్రమిద, వత్తీ, ఆముదము, నగ్గిపుల్ల
నొక్కొక్క రొకటి తెచ్చి,
గూడు దెఱచి,
ఈతచాప వేసి యెటొ
పడుకొన బెట్టి
వారి పనులమీద వారు చనిరి.

అంతకంటె
వార లందింపగల సాయ
మేమి గలదు?
చేత నేమిలేని పుట్టు పేదవారు
పొలతులందఱు పాప?
మైన నేమి హృదయ మంత మృదువు;
పొరలుచున్న దామె చిఱుచాపపై బడి
తెఱలు తెఱలు పొరల తెరలు గ్రమ్మ,
కనుల నీరు లురల నును చెక్కు లదరగా
ఎఱుక మఱపు దారి యిఱుకులందు.

కొంత సేపటి
కొక కొంత కోలుకొనుచు,
తడక చప్పుడుకాగ
రంగడని తోచి
ముంచుకొని వచ్చు దుఃఖమ్ము
మూతవెట్టబోయి,
బిగ్గఱగా నేడ్చివేయసాగె.

పిల్లికూన బెదరి చల్ల ముంతను ద్రోసె
మూమ కెట్టు లనుచు నామె లేచె;
చెవులు గింగు రనియె, చేతు లాన్చగ లేక
విసురు కొనుచు బోయి పసరు గ్రక్కె.

రంగన్నవచ్చె, బారెడు
నంగలతో తడకలాగి యవలకు ద్రోసెన్.

గంగమ్మ దుర్గతిం గని
చెంగున చేతులను నెత్తి చేటిచె చాపన్.

ఏమి జరిగినదో!
తనకేమి బోధపడుటయేలేదు!
తనగొంతు పలుకలేదు
అట్లె నిర్విణ్ణుడై
గంగులమ్మ తలను

తొడపయిం బెట్టుకొని
గ్రుడ్లు విడుచుచుండె.

ఒక్కచేత నామె చెక్కిలి నిమురుచు,
నొక్కచేత తలను నొక్కిపట్టి,
తేమలేని గొంతు తెమలక,
తాకిడి మాటలాడునేమొ
మమత నతడు!
ఆ చెయిసోకి,
గంగమ హృదంతర మందలి జీవనాడి
ఏదో చలియించె;
కన్నుగవ దోవలు విచ్చె;
కడింది మక్కువల్
పూచిన మొగ్గవోలె
తనువున్ వడదేర్చెను;
మానసాంతరాశాచిర దీర్ఘికాపతిత
కైవల జాల మొకింత తొట్రిలెన్.

కమలిన కన్నులన్ విరిసె
కమ్మని జీవలతాంత వాసనల్;
బ్రమసిన గుండెలోని
పరువమ్ముల గింజలు మోసులెత్తె;
నే యెముకలలోనికో
కలిసి యేగిన నెత్తుటిచాయ
మేనిపై గమగమలాడజొచ్చె;
తమకముల కమ్మల
నీనె నూరుపుల్.

ఆ క్షణమందు రంగడు,
సమాధి గతుండగు యోగివలె
నే అక్షర నిత్య సత్య
మధురాంతర భూమిక చెంత నిల్చి.

చిత్తక్షయ లక్ష్యసిద్ధి
గను దార్పుల, నూర్పుల జిక్కవట్టి
ప్రత్యక్ష పరాత్పరత్వ
చరమావధిలోన లయించు చుండెనో!
గంగమ మామా! యని, బి
గ్గం గౌగిలి హత్తి గుండె గంటలు మ్రోయన్
నింగి నరుంధతి కన్నుం
జెంగలువలు నీరుగ్రమ్మ చెక్కుల నిమిరెన్.

రంగడు పిల్లా! యని బి
గ్గం గౌగిలి హత్తి గుండె కన్నుల పూయన్,
నింగి పురూరవు కన్నున్

చెంగలువల నీరు గ్రమ్మ చెక్కుల నిమిరెన్,
కొక్కొరొకో!
అటంచు నదిగో!
బరువెక్కిన గొంతునెత్తి,
కొమ్మెక్కి, ఒకింత కొప్పు గదలించుచు
ఱెక్కల నార్చుకొంచు.

నీదిక్కయి కోడికూసినది;
ఇదే ప్రణవమ్ము,
దరిద్రమానవాస్సృక్కణ హోమ
మంత్రమున
కింక మొదల్ మఱి నిన్నచావులే;
నిన్నయే నేడు వీరికి;
నేటివలెనె రేపు వచ్చును -
గుండెల నూపివదలు;
మాపులే రేపులైన
ఈ మాయ వదలు
రేపకడ కోసమే
వీరి యీా ప్రతీక్ష!
కండలుగోసి, పాళ్ళిడి
బికారుల జేసి
జనాల నెత్తురుల్ పిండుచు,
కుక్క కూడయిన బెట్టక,
పొట్టల గొట్టి
కూళలన్ దిండుల కానబెట్టి,
జగతిన్ గరుణార్ద్రత కగ్గివెట్టు
పాషండుల వల్లకాడు
మనసా!
యిది మానవసంఘ మెట్లగున్?
గుండెలుకోసి యివ్వగల కూరిమి
కొండలు మోయు తాల్మి,
కట్టెండకు నిల్చి
బండల పెఠిల్లున బ్రద్దలు గొట్టి
బంగరున్ చెండుల
పైకి దీయగల చేవ.

జితించిన వీరి
కర్మ మార్తాండుల
ఱాచి ఱాపడు చెఱన్ గను
పాతకమేల దైవమా!
దైవమా; ఉంటివా? చచ్చినావ నీవు?
ధర్మమా! గెంటిరా? నిన్ను ధరణినుంచి?
సంఘమా; తలకెక్కెనా? సన్ని నీకు?
హృదయమా! మానవుడు నిన్ బహిష్కరించె
ధరణి గంపింప, కులగిరు లురలిపడగ,

మేరు శిఖరమ్ము నెక్కి, మిన్ను లదర,
చచ్చె నీలోకమున నాత్మసాక్షి యనుచు
నెత్తి నోరిడి కొట్టుకోనిండు నన్ను,
ఇదే పెన్న! ఇదే పెన్న!
నిదానించి నడు!
విదారించు నెదన్ వట్టి
ఎడారి తమ్ముడు!
ఇది అయిదవ సర్గ.

సర్వం సమాప్తం.

# ప్రాంతీయములకు టిప్పణి

| | |
|---|---|
| పాలు | కౌలు, కోరు |
| పరష | తిరణాల, తీర్థం |
| దస్త్రము | ప్రామిసరీ నోట్ల కట్టలు, 'పది వేల దస్త్రం ఉన్నవాడు' అంటే అతనికి పదివేలు బాకీ లోకులున్నారు. పదివేలు వడ్డీకి ఇచ్చి ఉన్నవాడు అని అర్థము. |
| అలేకార్లు | ఉద్యోగులు, ఆఫీసర్లు |
| మహడీ | మేడ |
| దూము | కలరా |
| దూడవయసు | పసితనం, ప్రాయం |
| రూకలు | రూపాయలు |
| కుమ్మక్కు | ప్రోత్సాహం |
| ఆయకము | తనఖా |
| వఱపు | కఱువు |
| కణజం | ధాన్యం పోసేవి |
| పాతర | ధాన్యం నిల్వచేసే నేలమాళిగలు |
| జీవాలు | గొఱ్ఱెలు, మేకలు |
| బొట్టు | కాసీ |
| కొట్టము | పాక |
| లోటా | పంచపాత్ర, గ్లాసు, టంబ్లరు |
| మిరపగింజలు | మిరియాలు |
| గవినీళ్ళు | కొండలో చెలిమనీళ్లు |
| పిన్న పెద్ద | పెద్దమనిషి, కలావ త్రవ్వే వారికి పెద్ద |
| సిల్వరు | అల్యూమినమ్ |
| మడక | నాగలి |
| చక్కరోలు | బజారులో ఉన్న చిన్న కఱ్ఱ రోలు |
| పైనిమిరి | వళ్ళు రుద్ది |
| పై | ఒడలు, శరీరము |
| మట్లు | నిలువులు |
| మెట్లు | సోపానాలు, మెఱికలు |
| ఔతుఖానా | స్నానాలగదిలో నీళ్ళు నిల్వజేసేందుకు గారతోకట్టిన పెద్దతొట్టి |
| మున్నూరు | మూడువందలు |
| పుట్టి | చిన్నతెప్ప |
| గౌరి | వీథి |
| బసివి | బసుపురాలు, ఊరిలోని దేవదాసీ లాంటిది |
| ఎనుము | గేదె |
| ఆకు | కన్నప్పుడు చక్కపెడతారు, ఆకు యిస్తారు, వేడికల్గించే వ్యాధి నివారణ చేసే ఔషధి |
| ఆకుమూట | పై పంచకొనసన ఆకు, వక్క, పొగాకు, సున్నం వగైరాలు కట్టుకున్న మూట |

| | |
|---|---|
| మాలపున్నమ | మహాలయ అమావాస్య |
| కట్లపొడి | పొగాకు కాడలుదంచి పెట్టిన పొడి, ఆకు వక్కలతో కలిపి ఆడవాళ్ళెక్కువగా వేసుకుంటారు |
| కనుమ | కొండదారిలో కొండదాటే యిరుకుదారి |
| పరువు | రెండున్నర మైలు |
| అంబటివారు | యింటిపేరు (వైశ్యులు ముఖ్యంగా) |
| తనకలాట | బాధ |
| ముంతెడు | రెండు తవ్వలు |
| మామ | మగడు, ఈ వర్గాలలోనే ఎక్కువగా ఈ అర్థంలో ఉపయోగిస్తారు |
| నల్తుము | నాలుగు తూములు |
| వల్లె | పంచ |
| పై దిరుగు | వళ్ళు తిరుగుడు, కండ్లు తిరుగుడు |
| పొంత | ప్రొయ్యిప్రక్కనే మంట తగులునట్లుగా పెట్టిన బాన |
| సందకాడ | సందెకడ, సాయంకాలం |
| నాల్నాళ్ళు | నాలుగు రోజులు |
| బాకీ | అప్పు |
| మామూలు | ఇనాము, ప్రతి పండుగకో పర్వానికో ఇచ్చే బహుమతి |